ఇక్బాల్

# ఫిర్యాదు, జవాబు

## (షిక్వా, జవాబె షిక్వా)

1989

తెలుగుసేత :

బెజవాడ గోపాలరెడ్డి

FIRYAADU, JAVAABU
(Shikwa, Jawabe Shikwa)

Iqbal's Poems rendered
into Telugu by
**Dr. B. Gopala Reddy**



ప్రథమ ముద్రణ : నవంబరు 1989
ముఖచిత్రం : అమర్

వెల : రూ. 10/-

ప్రతులకు :
ఆంధ్ర సారస్వత పరిషత్తు
తిలక్‌రోడ్, హైదరాబాదు-1

ముద్రణ :
శివాజీ ప్రెస్,
4-4-53, గంజ్‌బజార్
సికింద్రాబాద్.

# గ్రంథకర్త జీవన వివరాలు

| | |
|---|---|
| జననము : | 5 ఆగస్టు, 1907<br>బుచ్చిరెడ్డిపాలెం, నెల్లూరు జిల్లా.<br>తండ్రి-పట్టాభిరామిరెడ్డి<br>తల్లి-సీతమ్మ. |
| చదువు : | బుచ్చిరెడ్డిపాలెం, నెల్లూరు<br>ఆంధ్ర జాతీయ కళాశాల<br>(1921-24),<br>విశ్వభారతి, శాంతినికేతన్<br>(1924-27) |
| సమర పర్వము : | సర్కారుబడి వదులుట-జనవరి 1921<br>జైలు శిక్షలు—ఆరుమారులు.<br>1930, 31, 32, 33 లోను<br>1940, 41, 42, 43 లోను<br>కొంతకాలం జైలులో ఉండినారు దాదాపు<br>4 సం॥లు జైలులో మకాం. ఎ.బి.సి. క్లాసుల<br>ఖైదీగా, డెటెన్యూగా. |
| ఉద్యోగ పర్వము : | మద్రాసులో 86 మాసాలు<br>కర్నూలులో 19 మాసాలు<br>(ఆంధ్ర ముఖ్యమంత్రిగా)<br>హైదరాబాదులో 16 మాసాలు<br>(ఆంధ్రప్రదేశ్ మంత్రిగా)<br>కేంద్రమంత్రిగా 66 మాసాలు<br>ఉత్తర్‌ప్రదేశ్‌లో గవర్నరుగా 62 మాసాలు<br>ఆంధ్ర విశ్వవిద్యాలయ ప్రో—ఛాన్సలర్‌గా—<br>జూన్ 1951 నుండి 72 మాసాలు |
| సాహిత్య పర్వము : | తెలుగు భాషాసమితి అధ్యక్షత 1948-86 వరకు<br>ఆంధ్రప్రదేశ్ సాహిత్య అకాడమీ అధ్యక్షత-<br>ఆగస్టు 57 నుండి డిసెంబరు 1982 వరకు<br>కేంద్ర సాహిత్య అకాడమీ కార్యవర్గం (రెండవ తూరి)<br>జనవరి 78-జనవరి 88<br>జ్ఞానపీఠ సలహాసంఘం 1963-71 |

# బెజవాడ గోపాలరెడ్డి పుస్తకాలు

ముక్తకాలు

1. ఆమె (1978)
2. ఆమె జాడలు (1981)
3. ఆమె నీడలు (1981)
4. ఆమె తళుకులు (1982)
5. ఆమె చెణుకులు (1983)
6. స్ఫులింగాలు-తుషారాలు (1984)
7. స్వప్న హారము
   పీఠికలతో సహా (1986)
8. దీపికలు (1988)
9. కళికలు (1989)

దీర్ఘ కవితలు

1. కాల వాహిని (1979)
2. సాహిత్య సుందరి (80)
3. ప్రసూన మంజరి (81)
4. పరిమళ తరంగాలు (82)
5. సాగర సమీరాలు (83)
6. మలయ మారుతాలు (85)
7. సౌరభ నీరాజనాలు (87)

అనువాదాలు :

1. గాలిబ్ ప్రేమ శతకము
   ఇక్బాల్ ఆత్మ శతకము (1989)
2. అల్లామ ఇక్బాల్ కవితలు (1989)
3. ఫిర్యాదు - జవాబు (ఇక్బాల్) 1989

రానున్నవి

సొంతాలు :

1. శశాంక రేఖలు
2. గులాబి రేకులు
3. హంస తూలికలు

# అంకితము



మిత్రులు, తెలంగాణా సాహిత్య వైతాళికులు, కళాప్రపూర్ణులు, గాలిబ్‌ను ప్రచారము చేసిన ఆంధ్రకవులు-

స్వర్గీయ

డాక్టరు దాశరథి స్నేహ స్మృతికి

ప్రొఫెసర్ జి. వి. సుబ్రహ్మణ్యంగారింట ఏర్పాటైన గోష్ఠిలో షిక్వా అనువాదము కొంత విని, నెల్లూరు వచ్చి పూర్తిగా వినాలని సంకల్ప వాగ్దానము చేసి, వాగ్దానము పూర్తి చేయకనే వెడలిపోయిన సహృదయ సోదరుడు. దీర్ఘకాలము జైలుశిక్ష ననుభవించిన త్యాగశీలి!

19-11-1989
(ఆంధ్రుల ఐక్యతను నిలిపిన
శ్రీమతి ఇందిరాగాంధి జన్మతిథి)
మకాం - మద్రాసు.

బెజవాడ గోపాలరెడ్డి

# నివేదన

## 1

యూరోపులో చదివి, డాక్టరేటు పొంది, ఐరోపీయులు అనుభవిస్తున్న ఐశ్వర్య సంపదలను చూచి భారతదేశమునకు తిరిగివచ్చిన మహమ్మద్ ఇక్బాల్ ప్రతిక్రియ 'షిక్వా' (ఫిర్యాదు)లో ప్రతిబింబిస్తుంది. దేవుని మతమును వ్యాపింప చేయుటకు అన్ని కష్టములను పడిన ముస్లింలకు పేదరికము, ఇతరులకు సంపదలు కవికి సంక్షోభము కలిగించెను. విగ్రహముల చెక్కే వృత్తిని మాని, వానిని పగుల గొట్టే పనికి పూనినవారికి దైన్యము, పరులకు క్రొత్తక్రొత్త రాజ్యముల ఐశ్వర్యము ఇక్బాల్‌కు వింతగ కాన్పించినది. అణచి యుంచుకొన్న ఆగ్రహము దేవునే ముద్దా యిని చేసి దోషారోపణలో ప్రకటించినది. 1909 లో లాహోరులో జరిగిన కవి సమ్మేళనములో పఠించెను. ముస్లింలలోను, ముస్లింలు కాని వారిలోను పెద్ద కల వరము పుట్టించెను; వివాదాస్పదమైన కవితగ పరిణమించెను.

దేవునిపై నిందారోపణ చేయుట ముస్లింలు సమ్మతించలేదు. స్తుతించుటకు తప్ప, దేవుని తప్పు పట్టుటకు మానవునికి అర్హత లేదని వారి విశ్వాసము. దేవుని 'హర్‌జాయి' అన్నాడు. ప్రతిచోట కాన్పించే వేశ్య అని అర్థము. అందరిని తృప్తి పరిచే వగలాడి అనుట కోపమును కలిగించెను. అది మతగురువుల, మూఢ అనుయాయుల ప్రతిస్పందన!

దానికి వ్యతిరేకముగ ఆంగ్ల ప్రభావితులు, డాక్టర్లు, వకీళ్లు, సర్కారీ నౌకర్లు, యువకులు ఇక్బాల్‌ను ప్రశంసించారు. 'వాస్తవాన్ని వెలిబుచ్చారు; భగ వంతునికి కూడ భయపడక నిర్మొగమాటముగా నిజాన్ని బయట పెట్టారు' అని వారు హర్షాన్ని ప్రకటించారు. ఈ కవితను కంఠోపాఠము చేసి ప్రతిచోటా ఉల్లేఖిస్తూ వచ్చారు. కొత్త ఉత్సాహాన్ని పుట్టించింది. చర్చించారు. మంచి చెడ్డల విశ్లేషించారు. అనుకోని ప్రచారమును పొందింది.

ముస్లింలు కానివారు మతోన్మాద మన్నారు. విగ్రహాల పడగొట్టే యత్నానికి ప్రోత్సాహ మిచ్చే దన్నారు. మత కలహాలకు దారితీసే దన్నారు. ఆగ్రహముతోనే

దీనిని విమర్శించారు. ఈ రీతిగ భావసంచలన కలిగించింది యీ 'షిక్వా'. దీనికి మూడు నాలుగు ఆంగ్ల తర్జుమా లున్నాయి. ఆంగ్లేయుడు కూడ తర్జుమా చేసికొన్నాడు. నేను రెండు అనువాదాలను చూచాను. నాకు రెండూ నచ్చలేదనే చెప్పొచ్చు. బెంగాలీలో కూడా ఒక అనువాదాన్ని చూచాను. ఉర్దూ బాగా పరిచయమున్న ఏ తెలంగాణా రచయిత దీని అనువాదానికి పూనుకొనలేదు. నెల్లూరు జైలులో మాతో ఉన్న మధ్య ప్రదేశ రాజకీయ నాయకులలో ఒకరగు క్రిస్టియనైన శ్రీసాల్వే (ప్రస్తుతము పార్లమెంటు సభ్యులు, ఫైనాన్సు కమిషన్ అధ్యక్షులగు శ్రీసాల్వే తండ్రి) వద్ద యీ కవితను చదువ ప్రారంభించినాను. 'క్విట్ ఇండియా' 1942–43 దినాలవి. నాకు యిందు కొంత క్రొత్తదనము, ఉత్సాహాన్ని కలిగించే భావాలు ఉన్నవనే తలచాను. హైదరాబాదులో ఢిల్లీలో మంత్రిగ ఉండిన దినాల్లో, లక్నోలో ఉన్న దినాల్లో అప్పు డప్పుడు చదువుతూ వచ్చాను.

కడకు పదవీ విరమణయై, నెల్లూరు విశ్రాంతి దినాల్లో నా సొంత సాహిత్య కృషి సలుపుచున్న దినాల్లోనే, అనువాదానికి సంకోచంతోనే ప్రారంభించాను. ధైర్యం వచ్చింది. షిక్వా, జవాబె షిక్వా కొద్ది కాలములోనే అనువదించుట పూర్తి చేశాను. నేటి పరిస్థితులలో ఇస్లాం దేశాలు, పెట్రోలు సంపదతో మిన్ను మన్ను తెలియని స్థితిలో ఉన్నపుడు, దీని ఔచిత్య మేమని చర్చించుకొన్నాను. మథనపడ్డాను. కడకు ప్రచురించుటకే నిశ్చయించుకొన్నాను. ఇదే నా కడపటి ఉర్దూ అనువాద గ్రంథము. మూడవది. 1. గాలిబ్ ప్రేమశతకము, ఇక్బాల్ ఆత్మశతకము, 2. అల్లామ ఇక్బాల్ కవితలు, 3. ఫిర్యాదు--జవాబు.

ఇంతటితో నా అనువాద యుగము సమాప్తము. బెంగాలీనుండి రవీంద్రునితో ప్రారంభించి, ఉర్దూనుండి గాలిబ్ - ఇక్బాలులతో ముగియుచున్నది. ఇక నా సొంతాలు రేఖాచిత్రాలు ప్రచురించాలి. అధమము మూడు పుస్తకా లున్నాయి. నాలుగుకు పెరిగినా వింతలేదు.

## 2

జవాబు — 'జవాబె షిక్వా.' దేవుని సమాధానము. సంచలనం కలిగించిన షిక్వాకు మూడు నాలుగు సంవత్సరములు మౌనమును వహించి, 1913లో యీ సమాధాన్ని ప్రచురించెను. మొదటిదానికి వచ్చిన ప్రచారము, ప్రఖ్యాతి దీనికి రాలేదనే చెప్పాలి. నిందారోపణకు దేవుని జవాబు కూడ మనము వినాలి కదా! ముద్దాయి సంజాయిషీ విన్న తర్వాతనే తీర్పు!

అబ్బాయిలారా ! మీరు చెప్పుకొనే గొప్ప మీది కాదు. మీ పూర్వీకుల గొప్పతనాన్ని, చెప్పుకొని, దానిమీద వ్యాపారము చేస్తున్నారు; మీరు ఏమిచేశారు మీలో విభేదా లున్నాయి. సయ్యదులు, షేక్‌లు, మీర్జాలు మీరు యితరుల అనుకరిస్తున్నారు. మీలో నన్ను నిజముగ నమ్మినవారున్న, వారు బీర ముసల్మానులే !

"మీరు నన్ను నిజముగ నమ్మితే, మీకు ఏదైనా యిస్తాను. ఇంతకు ముందు యిచ్చాను. ముందైనా యిస్తాను. పలక బలపము తెచ్చి ఏమి కోరుతారో మీరే వ్రాసు కోండి. నమ్మినవారిని నేను ఎన్నడు వదలను" అని జవాబిస్తూ హితోపదేశము చేశారు.

ఏమైనా, ఇక్బాల్ కవితల్లో ఇది ఒక క్లాసిక్. భావాలు గొప్పవి. కొత్తవిధమైన కవితాధోరణి !

'సారా జహా సే అచ్ఛా' గీతము సర్వ ప్రియమైనది. ఫిర్యాదు - జవాబు 'వివాదా' స్పదమైన కవిత యైనది. కవిగా ఆయనను గుర్తించి, ఆంధ్రులు ఉచిత స్థానమును, గౌరవమును యిచ్చెదరుగాక !

మద్రాసు,
19-11-89

బెజవాడ గోపాలరెడ్డి

# ఫిర్యాదు

## (షిక్వా)

# 1

నష్ట పరుడనే ఎందుకు కావాలె ?
లాభాన్ని మరుస్తూ ఎందుకు ఉండాలె ?
రేపటి తలపుల మానాలా ?
నేటి దుఃఖాలలో మునిగి ఉండాలా ?
బుల్ బుల్ ఏడ్పుల వినాలా ?[1]
ఒళ్ళంతా చెవులు చేసికొని వినాలా ?
సహ గాయకుడా ! నేను ఏదైనా పువ్వు నా ?
మిన్న కుండాలా ?
చెప్పే శక్తి కలదు నాకు
అదే నాకు సాహసాన్ని నేర్పుతుంది !
నిందారోపణ దేవుడి మీదే
నా నోట మట్టి పడుతుంది.[2]

---

1. పువ్వు ప్రేయసి, బుల్ బుల్ ప్రేమికుడు,
ప్రేయసికై ప్రేమికుడు విలపిస్తూ ఉంటాడు.
2. శవాన్ని పూడ్చుటకు ముందు
అందరూ నోట మట్టివేస్తారు.

## 2

నిజమే ! నిన్ను నమ్మటలో ప్రసిద్ధులము మేము
వేదనా గాథను చెప్పక ఉండలేము
మౌన జంత్ర వాద్యములము మేము,
ఫిర్యాదులతో నిండి ఉన్నాము
ఏడుపు పెదవులకు వచ్చుచున్నది
సరిగా చెప్పలేకున్నాము
దేవుడా ! నిన్ను నమ్మిన వారి ఆరోపణలనూ విను !
నుతికి అలవాటైన వారి నిందనూ కొద్దిగా విను !

## 3

తొలినుండి నీ పురాతన విశిష్టత ఉండనే ఉన్నది
వన శోభగ ఉన్నది పుష్పము
కాని పరిమళములు వ్యాపింపకున్నవి
న్యాయము జరగాలి ఓ మహా కృపాళూ !
సుమ సౌరభము ఎట్లా వ్యాపిస్తుంది –
వాయువు తోడు లేకున్న ?
మా హృదయ సాంత్వనముకొరకు ఈ సంకులముల
సహించితిమి;
లేకున్న, నీ ప్రియభక్తుని అనుయాయులమగు
మాకు వెర్రి పట్టినదా ?

# 4

మాకు పూర్వము నీ ప్రపంచ దృశ్యము
వింతగా ఉండినది
కొన్ని చోట్ల రాళ్ళను మ్రొక్కుచుండినారు
కొన్ని చోట్ల చెట్లను ఆరాధిస్తుండినారు
మనుష్యుల దృష్టి ఆకారము కొన్న
భావాలకు అలవాటు పడినది
మరి ఎటుల విశ్వసించ గలరు -
కాన్పించని దేవుని ?
నీకు తెలుసు, నీ పేరు ఎవరైనా ఎత్తేవారా ?
ముస్లింల భుజ బలము నీ పని చేసింది.

## 5

ఇక్కడే నివసించేవారు
సల్జూకులు, తురానీలు కూడ
చైనాలో చైనావారు,
ఈరాన్లో అగ్ని పూజారులు
ఈ పుడమిలో యునానీవారు
కాపుర ముండిరి.
ఈ ధరణిలో యూదులూ
క్రైస్తవులూ ఉండిరి.
కాని, నీ పేరున
కత్తి ఎత్తిన దెవరు ?
చెడిన విషయాన్ని సరిదిద్దిన దెవరు ?

## 6

మేము ఒక్కరమే ఉండినాము -
నీ యుద్ధ భూములలో !
కొన్ని వేళల భూమి మీద
కొన్ని వేళల సాగరముల పైన
యూరోపు క్రైస్తవ మందిరములలో
సంధ్య నమాజ్ కేకల పలికినాము.
కొన్ని వేళల మండిపొయ్యే ఆఫ్రికా ఎడారులలో
మా ప్రతాపము ధరణీశుల
చక్షువుల చకిత మొనర్చింది.
కరవాలాల ఛాయలలో
దైవ స్తుతిని పఠించినాము !

# 7

మేము జీవించుట
సమరాలు, కష్టాల కొరకే !
మేము చనిపోవుట
నీ పేరు గొప్పతనము కొరకే !
ఖడ్గాల ఎత్తి పోరాడుట కాదు
మా పరిపాలన కొరకు
శిరస్సు అరచేతిలో పెట్టి తిరుగుట
ధరణి సంపదల కొరకా ?
భూలోక భోగములకు, సిరులకు
మా దేశాలు అర్రులు చాచినవా ?
విగ్రహాల విక్రయమునకు మారుగ
విగ్రహాల ధ్వంసము ఎందుకు చేశాము ?

# 8

సమరమున నిలిచిన –
ఎవరును మమ్ము కదలింప లేకపోయిరి
పులి పంజాలు కూడ
అడ్డు తొలగిపోయాయి
తల పొగరుతో ఎవరైన నిన్ను ఎదిరిస్తే
ఆగ్రహముతో పైకి దూకాము
ఖడ్గాలు ఏమి లెక్క ?
ఫిరంగులనే ఎదుర్కొన్నాము !
ఏకేశ్వరుని పద చిహ్నాల
అందరి హృదయముల ముద్రించాము
బాకులు, భల్లాల నీడలలో కూడ
నీ సందేశాన్ని వినిపించాము.

## 9

నీవే చెప్పు, కైబరు కనుమను
త్రవ్వింది ఎవరు ?
కైసర్ పట్టణాన్ని గెలిచి
దాని తల వంచిన దెవరు ?
నిర్మిత దేవుల మూర్తుల
ధ్వంసము చేసిం దెవరు ?
అవిశ్వాసుల సైన్యాల
చెండాడిన దెవరు ?
ఈరాన్‌లోని అగ్ని గుండాలను
ఆర్పిం దెవరు ?
దైవ పూజాగ్నిని
పునర్జీవింప చేసిన దెవరు ?

## 10

నిన్ను మాత్రమే కోరిన జాతి ఎద్ది ?
మరి నీ కొరకే శ్రమ భరిత
సమరముల సల్పిన దెవరు ?
పుడమిని ఆక్రమించిన కరవాలముచే
రాజ్యమును స్థాపించిన దెవరు ?
ఎవరి ప్రార్థనా ధ్వనులచే
ధరణి మేల్కొనినది ?
ఎవరి భయముతో విగ్రహములు
జడిసి వణకి పోయినవి :
బోర్ల పడి దేవుడు ఒక్కడే
అని ప్రకటించాయి ?

## 11

రణ మధ్యములో నమాజ్ వేళ అయినచో
మక్కా వైపు తిరిగి, భూమిని ముద్దిడినది ముస్లిములు
ఒకే వరుసలో నిలిచారు
ప్రభువులు, నౌకర్లు -
ఎవరూ బానిసలు కారు !
బానిస యజమానులు కారు
బానిసలు, దొరలు,
భిక్షులు, ఒక్కటై
నీ దివ్య సమ్ముఖమున చేరినపుడు
అందరూ సమానమే !

# 12

ధరణి సమావేశాలలో
ఉదయము, సాయంత్రము తిరిగినది
ఏకేశ్వరుని మదిరమును నింపుకొని
చషకము వలె తిరిగినది
కొండలలో, ఎడారులలో
నీ సందేశమును గైకొని తిరిగినది
నీకే తెలుసు, ఎన్నడైన
వృథాగా తిరిగామా ?
ఎడారుల లెక్క ఏమి ?
సముద్రములను కూడ వదల లేదు మేము !
అట్లాంటిక్ సముద్ర తీరాల
గుర్రాల పరుగెత్తించింది మేము !

# 13

మహీ తలము బూటకములు
తొలగించినది మేము
మానవ సంతతిని బానిసత్వము నుండి
విడిపించినది మేము
నీ 'కాబా'ను నొసళ్ళతో
రాసి రుద్దే వారితో నింపినది మేము
నీ ఖురానును గుండెలకు
హత్తుకొను నటుల కావించింది మేము
అయినా మా మీద నమ్మకస్తులు
కారని దోషారోపణ !
మేము నమ్మకస్తులు కాకపోయినా
నీవు కూడ దయార్ద్ర చిత్తుడవు కావు !

## 14

మతాలు ఇంకా ఉన్నవి
వానిలో పాపము చేసేవారు ఉన్నారు
అణకువతో ఉండేవారు
గర్వ మదిరముతో తూగేవారు ఉన్నారు
సోమరులు, 'ప్రమత్తులు', చురుకైన వారు ఉన్నారు.
నీ పేరుతో చికాకు పడేవారు
వందల మంది ఉన్నారు
నీ వ్యతిరేకుల భవనాలపై
అనుగ్రహాలు క్రుమ్మరిస్తావు
పిడుగు పడితే — దిక్కు లేని
ముస్లిముల మీదే !

# 15

దేవ విగ్రహ శాలల్లో అనుచున్నారు
ముసల్‌మానులు వెడలిపోయారు
వారికి సంతోషము !
'కాబా' సంరక్షకులు వెడలి పోయారు
పుడమి విడిదుల నుండి;
ఒంటెల పాటల వారు వెడలిపోయారు -
తమ బాహు మూలములలో
ఖురానును దోపుకొని వెడలిపోయారు;
అవిశ్వాసకులు నవ్వుచున్నారు
ఇది నీ అనుభవానికి వచ్చిందో లేదో ?
నీ అభిన్నత్వపు మర్యాద
నీకు ఉన్నదో లేదో ?

## 16

ఇది ఫిర్యాదు కాదు
వారి ఖజానాలు నిండి యున్నవి;
గోష్టులలో సరిగ మాటలాడుటకును
తెలియని వారు.
నిష్ఠుర విధి ఏమి టంటే
ఆ అవిశ్వాసకులు పొందుచున్నారు
అప్సరసల, ప్రాసాదముల!
దిక్కు లేని ముసల్మానులకు
కేవలము అప్సరసలకై వాగ్దానాలు;
ఇప్పుడు ఆ అనుగ్రహము లేదు
ఆ అభిమానము లేదు -
ఆ మాట ఎందులకు ?
తొలి నాళ్ళ ఆశ్రయము లేదు!

# 17

ఎందులకు ముసల్మానులకు
ప్రపంచ సంపదలు కొరవడినవి ?
నీ విభూతులకు ఎల్లలు లేవు' లెక్కలు లేవు
నీవు కోరిన, ఎడారుల గుండెల నుండి
నీటి బుడగలు పారగలవు;
ప్రాకే మరు భూముల మార్గములలో
ఎగిరే ఎండమావుల అలలు నమసి పోగలవు;
విరోధుల వెక్కిరింత ఇదే
చెడ్డ పేరు ఇదే నిస్సహాయత ఇదే !
నీ పేరున అసువులు ఒడ్డినందుకు
మారుగ అవమానమేనా ?

# 18

ఇప్పుడు విరోధుల ప్రేమించే
ప్రపంచ మైనది
మాకు రిక్త ఆశా భావాల ప్రపంచమైనది
మేము వెడలిపోగా ఇతరులు
పాలించే ప్రపంచ మైనది
మరల నీవు అనరాదు
ఏకేశ్వర భావము లోపించిన ప్రపంచ మని !
మేము జీవించుట ప్రపంచములో
నీ పేరు నిలుపుటకు !
ఎచ్చటైనా సాధ్యమా -
సాఖీలు చన, పాన పాత్రలు మాత్రము
తృప్తి పరచుట !

# 19

నీ గోష్ఠి ముగిసి పోయినది
అనురక్తులు వెడలి పోయిరి
రాత్రి నిట్టూర్పులు నిలిచిపోయినవి
ఉదయపు విలాసాలు నిలిచిపోయినవి
హృదయము నీకు ఇచ్చి పోయిరి
వారు మరలి రాకనే పోయిరి
వచ్చి కూర్చోనే లేదు
బయటకు వెళ్ళి పోయిరి.
అయ్యో ! ప్రేమికులారా !
రేపటి వాగ్దానాలను గైకొని పోయిరి
ఇక వారిని వెదకు
దీప్తి మంతమగు నీ ముఖ దీపముతో !

# 20

లైలా వేదనయు అదే
మజ్నూ పాత్రయు అదే
అరేబియా ఎడారులలో, కొండలలో
హరిణాలు పరుగు లిడుటయు అదే
ప్రేమ హృదయము అదే
సౌందర్యపు ఇంద్రజాలము అదే
మహమ్మద్ ప్రవక్త అనుయాయులు వారే
నీవూ అదే !
మరి, కారణము లేని
ఆగ్రహానికి అర్థ మేమి ?
నీ ఉన్మత్త భక్తులపై
నీ రోషదృష్టికి అర్థ మేమి ?

# 21

నిన్ను వదలితిమా, ఆరబ్ రసూలును వదలితిమా ?
విగ్రహాల చెక్కే వృత్తి ఏమిటి !
విగ్రహాల నాశనము చేయుట వదలితిమా ?
ప్రేమను వీడితిమా ? ప్రేమ ఆవేశమును వదలితిమా ?
నిన్ను ప్రేమించిన వారిని వీడితిమా ?
వారిని ప్రేమించుట మానితిమా ?
నీ కీర్తి గానానలమును
హృదయములలో అణచి ఉంచుకో లేదా ?
నీ వీర దాసుల వలె జీవితమును గడుపలేదా ?

## 22

ప్రేమేమిటి ? తొలి విలాసాలైన లేవే!
నిన్ను స్వీకరించి వెడలే మార్గ మేమిటి ?
నడచుటకు అనుమతి యైన లేదే !
ఆందోళన పడు హృదయము
దిక్కుల సూచించు ముల్లు వలె కదలుట లేదే !
విశ్వాసము ధర్మసూత్రాల అనుసరించుటయు లేదే !
ఒక్కొక్క వేళ మాతో
ఒక్కొక్క వేళ పరాయి వారితో
నీ వినోద సరసాలు -
మాట అనరానిదే ! నీవు కూడ
అన్ని చోట్ల కవ్వించే వగలాడివే !

## 23

పారాన్ శిఖరాల మీద
ధర్మాన్ని సంపూర్ణముగ ఆవిష్కరించావు నీవు;
ఒక్క సైగతో వేల హృదయాల
వశ మొనర్చు కొన్నావు
అగ్నిని పెంచుట ఏమి? వారి ప్రేమనే పొందావు
నీ బుగ్గల ఊర్పుచే సభకు వేడిమి ఊదావు
నేడు ఎందుకు మా హృదయములలో నిప్పు రవ్వలు రేగవు ?
మేము కాలే సామానులమే -
నీకు జ్ఞాప్తి లేక పోవచ్చు !

## 24

ఆరబ్బు లోయలలో గొలుసుల
చప్పుడుల అలజడులు లేవు;
ఉన్మత్తుడు మజ్నూకు ఒంటె అంబారీ దృశ్యాలు లేవు
ఆ సాహసాలు లేవు, మేము లేము, హృదయాలు లేవు;
ఇల్లు పాడుబడినది, గోష్ఠి వైభవాలు లేవు -
అయ్యో ! ఆనంద దినములా ?
శత హేలా విలాసములతో వచ్చేవి
ముసుగు వదలి లజ్జ వీడి
మే ముండిన గోష్టి దిశలకే వచ్చేవి !

# 25

ఇతరులు మధువును త్రాగుచు
తోటలో కొలను గట్టున కూర్చున్నారు
చేతిలో పాన పాత్రను పట్టి పరవశులై
సంగీతాన్ని వింటున్నారు;
తోటలోని చప్పుడులకు దూరముగ ఒక వైపు కూర్చొని
నీ అనురక్త భక్తులును నీకై నిరీక్షించుచు ఉన్నారు
నీవే స్వయముగ శ్రద్ధా తృష్ణలను
నీ శలభములకు మరల ఇమ్మ !
పాత పిడుగులకు
గుండెల కాల్చుటకు ఆనతి ఇమ్మ !

## 26

పిచ్చిగ తిరుగు చుండిన జాతులు
తిరుగ అరేబియా వైపునకు నడిపే
పగ్గాలకు లోబడినవి
ఈకలు లేని బుల్‌బుల్‌లకు
ఎగిరే ఉత్సాహ శక్తి నిచ్చి ఎగురవేయుము !
సువాసనకై కుతూహల పడే కళికలతో
వనము ఆందోళిత మగుచున్నది
ప్రేమోగ ఉత్సుకములైన వేగిరపడు వాద్యములను
కొద్దిగ మీటుము !
తంత్రుల నుండి బయట పడ
పాట వ్యాకుల పడుచున్నది;
'తూర్' పర్వతము అగ్నితో ధగధగ లాడుటకు
త్వరపడు చున్నది !

# 27

నీ దయను పోగొట్టుకొని
పెద్దల ధర్మాన్ని పాలించే వారి
కష్టాలను సుళువు చేయుము !
విలువ లేని పిపీలికలను
సుల్తానుతో సమ స్కంధము చేయుము !
ప్రేమ కరువైన వారికిని
ఆశల కల్పించి ఔదార్యము.
మందిరములో కూర్చొను వారిని
ముసల్మానుల చేయుము !
నా బహు కాల నిష్ఫల వాంఛల నుండి*
ఊరే రక్త ధారల రుచి చూచుచున్నాను
హృదయ పార్శ్వమున బల్లెము గ్రుచ్చుకొన
ఏడ్పులతో గిజగిజ లాడుచున్నాను ।

---

*కడపటి నాలుగు పంక్తులు
మూలములో పర్షియన్‌లో ఉన్నవి.

## 28

వన రహస్యముల వనము వెలుపలికి
సుమ సౌరభములు గైకొని పోయెను
ఎట్టి దుర్దినము, పుష్పములే
వనమునకు ద్రోహము తలపెట్టెను.
పుష్ప ఋతువు అంతమాయెను.
వనములో ఎగురు చుండిన
శకుంతములు కొమ్మల నుండి
ఎగిరిపోయెను
ఇప్పటికిని గాన తత్పర మైన
బుల్ బుల్ ఒకటి యున్నది.
సంగీతావేశము దాని హృదయములో
తరంగిత మగుచున్నది.

## 29

వృక్ష శాఖల నుండి శుక శారికలు
ఎగిరి పోయినవి
పుష్ప దళములు వరుసగా రాలి
చెల్లా చెద రైనవి
పురాతన వన దీప్తులు మసకలు క్రమ్మి
మ్లానమయినవి
పత్ర వసనములు ధరించిన శాఖలును
వివస్త్రములై పోయినవి
ఋతువుల చెరనుండి తప్పుకొని
దాని స్వభావము స్వతంత్ర మైనది
మేలుగా ఉండెడి - తోటలో ఎవరైన
దాని ఫిర్యాదుల ఎరిగి ఉండిన !

# 30

మరణించుటలో ఆనందము
మిగిలి యున్నది !
జీవించుటలో సంతోషము లేదు
ఏదైన సంతస ముంటే, గుండె నెత్తురును
పిండుటలోనే !
దర్పణములో నా గుణాలు
ఎంత మ్లానము లయినవి !
హృదయములో వెలుగులు
ఎటుల ఆందోళితములు !
కాని, ఈ వనములో వీక్షించే వాడే లేడు
గుండెలో నున్న మచ్చ
నెత్తురుతో ఎఱ్ఱగ నైన లేదు !

# 31

అనన్యమైన బుల్‌బుల్ గుండెను
చీల్చి దిగులు పాటలనుండి వేరుచేయుము
మేల్కొన్న వారు గంటల మ్రోతల
నుండి సందడించు గుండె కలవారు కానీ
అంటే, మరల నూతన విశ్వాస కాలాల
గుండె కలవారు కానీ
మరల పురాతన మదిరమునకై
దప్పిక కొను గుండె కలవారు కానీ !
నా కూజా పర్షియాది అయితే ఏమి ?
నా మదిరము అరేబియాదే !
భారతీయ గీతము నాది అయితే ఏమి ?
నా స్వరము అరేబియాదే !

తర్జుమా
18-11-83

# 1

హృదయమునుండి వెలువడిన మాట
ప్రభావ పూర్ణముగ ఉన్నది
రెక్కలు లేవు, కాని ఎగిరే శక్తి ఉన్నది !
గురి తప్పనిది, ఎత్తుల మీద దృష్టి నిలిపింది !
మట్టి నుండి ఎగిరింది –
విను వీథులలో విహరించింది !
నా మీద ప్రేమ క్షోభాల కలిగించేది
తల తిరిగించేది చాకచక్యముతో
మనస్సును సుడిగుళ్ళలో త్రిప్పేది
ఆకసము బద్ధలై నది నాకై
నిర్భర మగు రోదనతో

## 2

పురాతన గగన మండలము విని అన్నది:
"ఇచ్చట ఎవరైనా ఉన్నారా ?"
గ్రహ సముదాయము అన్నది :
"స్వర్గ ధామమున కన్న పైన ఎవరైన ఉన్నారా ?"
చంద్రుడు అన్నాడు : "కాదు, కాదు
ఎవరో భూలోక వాసి యై ఉంటాడు !
నక్షత్రరాశి అన్నది :
"ఇచ్చటనే ఎవడో దాగి ఉన్నాడా ?
ఎవరైన నా మీద ఫిర్యాదును అర్థము చేసికొన్న
స్వర్గద్వార పాలకుడే చేసికొన్నాడు
నన్ను స్వర్గము నుండి గెంటబడ్డ
మనిషినిగా భావించాడు!"

## 3

వియద్ విహారులకును విస్మయము
కలిగించింది: ఈ శబ్ద మేమి టని
స్వర్గ వాసులకును గ్రాహ్యము కాని
ఈ రహస్య మేమి టని
స్వర్గ సీమలకును మానవుని
రాక పోకలు కలవా ఏమి అని
చిటికెడు మట్టికిని ఎగిరే శక్తి
వచ్చినదా ఏమి అని
మర్యాదల మరచి, మట్టిలో మనే
మనుష్యులు ఎటుల ఉన్నా రని
పొగరుగ మొరటుగ క్రింద నేలమీద
కాపుర మున్నవాడు ఎటుల ఉన్నా రని !

# 4

ఈ రీతిగ మదముతో అల్లామీదను
కోపముగ ఉన్నారే !
సర్వ సంరక్షకు డని అల్లాకు
వంగి నమస్కరించిన మానవుడు ఈతడేనా ?
ప్రపంచ నిజ స్వభావము ఎరిగిన వాడు ఈతడేనా ?
ప్రకృతి రహస్య వేత్త
కాని వినయముల మెలకువలతో
పరిచయము లేనివాడు
సంభాషణ శక్తి కలదని
మానవునికి గర్వము !
మాటలాడు తీరు తెలియదు
ఆ అజ్ఞానులకు -

## 5

దుఃఖ భరితమైన నీ గాథ
ధ్వనిగ వచ్చినది
అశాంతి అశ్రువులతో నీ పాత్ర
పొంగి పొరలు చున్నది.
గగన మంతా క్రమ్మి నిండినది
నీ ఉన్మత్త ప్రలాపములతో
ఏ రీతిగ భాష పరుషమో అంత,
నీ హృదయము ఉన్మాద భరితము
నీ ఫిర్యాదుకు సంతసము ఎట్టి అందమైన
స్తుతిగ చేసితివి నీవు
భక్తుని, అల్లాను సమాన అంతస్తులో
సంభాషించు నటుల చేసితివి నీవు !

# 6

మేము దయతో ప్రవర్తించు వారము
కాని అడిగే వాడే లేడు.
దారి ఎవరికి చూప గలము ?
గమ్య స్థానమునకు వెడలే వాడు లేడు.
అందరికీ సమాన సౌకర్యములే కలవు
కాని అర్హతను నిరూపించు కొను వాడు లేడు
మనిషి చేయబడ్డ ఆ మట్టే కాదు ఇది
ఎవడైనా అర్హుడైతే అతనికి
సకల సంపదల మహత్తు నిస్తాము
అన్వేషించే వారికి లోకాలు
క్రొత్తవీ ఇస్తాము !

## 7

హస్తములు బల హీనములు
నాస్తికతకు హృదయము
అలవాటు పడినది
ప్రవక్త పెద్ద పేరుకు కారణ మైనది మతము
విగ్రహాల పగుల కొట్టుట ఎగిరి పోయినది
మిగత ఉన్నవారు విగ్రహాలు చేయుటలో నిమ
తంద్రులు విశ్వాస ముంచిన వారుగా ఉండిరి
కొడుకులు విశ్వాసము లేనివా రైనారు
మదిరమును సేవించు వారు క్రొత్తవారు
మదిరము క్రొత్తదే, కూజాలు క్రొత్తవే!
పూజా వేదికలు క్రొత్తవే !
విగ్రహాలు క్రొత్తవే—మీరూ క్రొత్తవారే !

# 8

ఇచ్చట పవిత్రమైన భక్తి శ్రద్ధలకు
విలువ లుండిన దినములు ఉండినవి
మైదానముల పుష్పములకు
అమని కాలము గర్వించేది
ముస్లిములుగా ఉన్న వారు
అల్లామీద ఉన్మత్త భక్తులుగా ఉండినారు
ఎల్ల వేళల మీకు ప్రియుడు
సర్వ వ్యాపిగా ఉండిన వాడు
ఒక చోటే నిలిచి స్థిరమైన వానితో
భక్త బృంద బాంధవ్యమును నెలకొల్పుడు
ప్రవక్త యైన మహమ్మద్ మతమును
ధృఢముగ నెలకొల్పుడు!

# 9

ప్రాతః కాలముననే మేల్కొనుట
మీకు ఎంత భార మైనది !
మమ్మ మీరు ఎప్పుడు
ప్రేమించు వారుగ ఉండిరి ?
అవును, నిద్రే మీకు ప్రియముగ ఉన్నది
మీ స్వేచ్ఛా స్వభావాలపై
రంజాన్ కఠిన నియమాలు భారమైనవి
మీరే చెప్పండి, నిష్ఠాపరుల నియమ మింతేనా ?
జాతి మతముపై ఆధారపడి ఉన్నది
మతము లేనపుడు మీరూ లేరు
పరస్పర ఆకర్షణ లేనపుడు
నక్షత్ర మండలమే లేదు !

# 10

ఇలలో ఎవరైన ఏ కళా
తెలియని వారున్న అది మీరు !
ఏ జాతికైన తన గూటిమీద
శ్రద్ధ లేకున్న, అది మీరు !
పిడుగులు ఎచ్చట దాగి యున్నవో
అట్టి గడ్డివామి మీరు !
మీ పూర్వజులను పాతి పెట్టిన
గోరీలను అమ్మి తినేవారు మీరు !
గోరీలపై వ్యాపారము సాగించి
పెద్ద సొమ్ము సంపాదించారు
శిలా విగ్రహాలు దొరకినా
అమ్మి లాభాలు గడించరా ?

# 11

భూ ఫలకమునుండి అసత్యాలను
ఆణచి వేసిన దెవరు ?
మానవ జాతిని బానిసత్వము నుండి
తొలగించిన దెవరు ?
నా 'కాబా' ను నొసళ్ళచే
మ్రొక్కించిన దెవరు ?
నా 'కురాన్'ను గుండెలకు
హత్తుకొనే విధముగా చేసిన దెవరు ?
వారు మీ పూర్వీకులుగా ఉండిన వారే !
కాని మీరు ఏమి చేశారు ?
చేతుల మీద చేతులు నలుపు కొనుచు
రేపటికై నిరీక్షించి యున్నారు

# 12

ఏ మంటివి ? అప్సరసల
వాగ్దానాలు మాత్రమే ముస్లిములకు !
నిందారోపణ సరిగ చేయుటకును
వివేకము అవసరమై యున్నది;
మానవ స్వభావానికి న్యాయము చేయుట
ఆదినుండియు మాకు అలవాటుగ నున్నది
ముస్లిముల నియమములకు
బద్ధులు కాని అవిశ్వాసకులకు
అప్సరసలు, ప్రాసాదాలు ప్రాప్తమగు చున్నవి.
మీలో అప్సరసల కోరే వారే లేరే
'దూర్' పర్వతపు కాంతి మాత్రము ఉన్నది
చూచే 'మూసా' మాత్రము లేదు !

# 13

ఈ జాతికి లాభము ఒకటే
నష్టము కూడా ఒకటె
ఒకడే అందరికీ ప్రవక్త మతము ఒక్కటే
విశ్వాసము ఒక్కటే
పవిత్రమైన పూజావేది ఒక్కటే
దేవుడు ఒక్కడే, ఖురానును ఒకటే
ముస్లిములును ఒక్కుమ్మడిగ ఉండిన
బాగుగ పెద్ద విషయముగ ఉండేది !
అట నట భేదా లున్నవి
అట నట కులా లున్నవి
కాల స్రవంతిలో పైకి తేలుటకు
ఇవేనా మార్గాలు ?

## 14

సర్వాధికారి యైన అల్లా ప్రవక్త
నియమ సూత్రాలను వదలిన వాడు ఎవడు ?
కాలానికి సరిపడే ఆచరణ
విధానము ఎవరిది ?
పరాయివారి వైఖరి ఇంపైనది
ఎవరి నేత్రాలకు ?
పూర్వజుల శైలీ విధానము రోతైనది
ఎవరి దృష్టిలో ?
హృదయములో వేడి లేదు
ఆత్మలో ధర్మ విచారము లేదు
మహమ్మద్ సందేశానికి ఇసుమంతైనా
మీ వద్ద విలువ లేదు!

## 15

మసీదులకు వెళ్ళి వరుసలో
నిలిచేవారు బీదలే
ఉపవాసాల కష్టాలను ప్రియముగ
సహించే వారు బీదలే
నా పేరును ఉచ్చరించు వారు
ఎవరైనా ఉన్న బీదలే
మీలో పర్దాను అనుసరించు వారు
ఎవరైనా ఉన్న బీదలే
సంపదల మత్తులో ఉన్నారు పెద్దలు
నన్ను విస్మరించిన వారు
సరియైన ధర్మము బ్రతికి యున్న
బీదల ఊపిరితోనే !

# 16

దేశ ఉపదేశకులకు
ఆ ధృఢమైన తలంపులు లేవు
విద్యుత్తుల వెలుగు లేదు
జ్వాలల ఉత్తేజము లేదు
సంధ్యా నమాజు సమయ మను
పిలుపు కేకగ మిగిలినది
ఆ భక్తి శ్రద్ధల రవళుల
ఉచ్ఛ స్వరములు లేవు
తత్త్వ సూత్రాలు మిగిలాయి!
ఆత్మార్పణ త్యాగాలు లేవు
మసీదులు విషాద గీతికా శాల లయ్యాయి.
నమాజ్ స్థలాలు కాలేదు
అంటే, మహా పురుషులైన
పూర్వజుల అరబ్బీ తత్త్వము లేదు !

## 17

ప్రపంచములో ముస్లిములు
అర్హులైనారని అలజడి లేచింది!
మేమనేది, సరియైన ముస్లిములు
ఎచ్చటైనా ఉన్నారా?
వైఖరిలో మీరు క్రైస్తవులు
నాగరకతలో మీరు హిందువులు
యూదులు చూచి సిగ్గిల్లే ముస్లిములు
మీరేనా?
మీరు సయ్యదులు కూడ,
మీర్జాలు కూడ, అఫ్ఘనులు మీరే
అన్నీ మీరు, చెప్పండి- మీరు
ముస్లిములు కూడానా?

# 18

భాషించు వేళల ముస్లిముల వర్తన
భయ రహితముగ ఉండేది
న్యాయము అతనికి ధృడముగ ఉండేది
దయా దాక్షిణ్యములు
పక్షపాతము లేక పవిత్రముగ ఉండేవి!
ముస్లిముల స్వభావ తరువు
తగని పనుల వెరపులతో పచ్చగ ఉండేది
సాహసములతో జ్ఞానబల సంపన్నమైన
వ్యక్తిత్వముతో ఉండేది ?
*స్వయముగ తరుగుచు
తన్మయత్వపు ఆర్ద్రితతో
కూజా వలె ఉండేది !
*మదిరానందపు పొంగు
క్రుంగి క్షీణించుచు
కూజా వలె ఉండేది !

*వీటి మూలము పర్షియన్‌లో ఉంది

## 19

అసత్యాల నరాలకు ప్రతి ముస్లిము
బాకు వలె ఉండేవాడు !
ఆతని జీవిత దర్పణములో
ఆచరణ సద్గుణముగ కన్పించేది
అతని విశ్వాసము నిజ భుజ బలము
మీదనే ఆధారపడేది
మీకు మరణ మంటే భయము !
అతనికి దేవుడంటే భయము !
తండ్రుల విద్యలు
కుమారులకు తెలియక పోతే
కుమారులు తండ్రుల వారసత్వములో
ఎటుల హక్కుదారు లగుదురు ?

## 20

మధు మత్తతతో భోగపురుషు డైతే
అతను ముసల్మానా ?
అది ముసల్మాన్ వైఖరా ?
హైదరంటే మీకు గర్వము లేదు
ఉస్మాన్ ఐశ్వర్య సంపదలు లేవు
మీ పూర్వీకులకూ, మీకూ
ఎట్టి ధార్మిక సంబంధ మున్నది ?
ఆ దినములలో ముస్లిం అయి
గౌరవమును పొందే వాడు
మీరు ఖురాన్ తత్త్వాన్ని వదలి
తుచ్ఛు లైనారు !

# 21

మీరు పరస్పరము కోపోద్రిక్తులు
వారు కృపాళువులు
మీరు తప్పిదముల చేయువారు
వారు తప్పిదముల ఎగిరిన వారు
వారు ఇతరుల తప్పిదముల
గమనించని వారు, కరుణించు వారు!
అందరు కోరుదురు-
నక్షత్ర మండలముపై వసించా లని !
అప్పటి వలె, శక్తి గల గుండె వాడు
జన్మించినాడా ?
సింహాసనాలు వారికి ప్రాప్తించినవి
కిరీటాలు వారికి కైవస మైనాయి
ఇట్టి మాటలు ఎన్నో ఉన్నవి—
వానికై మీలో సిగ్గుపడు వాడైన గలడా ?

# 22

అత్మ వినాశకముగ ఉన్నది మీ వైఖరి-
వారు ఆత్మ గౌరవముతో
స్వాభిమానముతో ఉండేవారు !
మీరు సౌభ్రాత్రము నుండి
తొలగు వారు
వారు సౌభ్రాత్రముకై బలి యగువారు
మీరు తలనుండి కాళ్ళ వరకు
మాటలు చెప్పువారు
వారు నఖశిఖ పర్యంతము కార్య శూరులు
మీరు మొగ్గలకై ఆశపడు వారు
వారు నందన వన సీమల మను వారు
ఇప్పటికిని దేశ చరిత్రలు
వారిని స్మరించుచున్నవి;
జీవన పథములో వారి
సుస్వభావముల కాలి అడుగు లున్నవి !

## 23

గగనముపై తారల విధముగ
జాతిపై వెలుగును చిందిరి వారు
హిందూ విగ్రహాల అభిమానముతో
మీరు బ్రాహ్మణులును అయితిరి
ఎగిరే ఉత్సాహముతో గూటికి దూరమైతిరి
అచరణ లేనివారైతిరి
ఆ మతమును అప్రతిష్ఠ పాల్జేసితిరి మీరు
వారి సంస్కృతి అన్ని అవరోధముల నుండి
విముక్తి పొందెను
'కాబా' నుండి తెచ్చిన విశ్వాసాన్ని
విగ్రహ శాలల్లో మీరు ప్రతిష్ఠించితిరి !

# 24

శ్రమ భరితము లైన
మజ్నూ ఎడారి ఏకాంత భ్రమణములు లేవు
నగర వాయువుల పీల్చి
ఎడారి కొలతలును లేవు
నగరాలలో ఉన్నా, లేకపోయినా
వారు ప్రేమోన్మాదులుగ నుండిరి
లైలా ముఖము అనవగుంఠితము
కావలె ననే కోరుచుండిరి !
దూషణ పరుషము కారాదు
ఫిర్యాదు న్యాయ రహితము కారాదు
ప్రేమ స్వతంత్ర మైన,
సౌందర్యమును ఏల
స్వతంత్రము కానేరదు ?

# 25

అధునిక యుగము పిడుగు వంటిది.
ప్రతి గడ్డివాముకు అగ్గి పెట్టేదే!
ఎడారి గాని తోట గాని,
దానినుండి సురక్షితములు కావు.
ఈ క్రొత్త అగ్నికి
పురాతన దేశాలు ఇంధనములు.
అంత్య ప్రవక్త మహమ్మద్ మతమునకు
తొడిగిన చొక్కా మంటల వంటివి
నేడును ఇబ్రహీం విశ్వాసాన్ని పుట్టించినచో
అగ్ని ఉద్యాన వన శోభను మరల పుట్టించును ॥

# 26

తోటమాలీ ! తోట రంగును చూచి
దుఃఖించకు !
మొగ్గల తారలతో కొమ్మలు
మెరయ గలవు
కలుపు ముళ్ళు తోటనుండి
తొలగి పోగలవు
పువ్వులు మృత వీరుల రక్తము నుండి
పుట్టి నటుల ఎర్రగ ఉన్నవి
గగన వర్ణము నెమ్మదిగా చూడు
ఎర్రగ ఉన్నది
ఇది ఉదయించే సూర్యుని
దిగంత అరుణ రాగ భాసురమై
యున్నది !

# 27

జీవన వనములో కొన్ని రాష్ట్రములు
ఫలముల సేకరించినవి
కొన్ని ఫలములు ఏరుకొన లేక పోయినవి
కొన్ని శిశిరమునే వీక్షించు చుండినవి
వందల వృక్షములు మోడులై పోవుచుండినవి
కొన్ని పచ్చగ పెరుగు చుండినవి
వందలు వన గర్భమున ఇంకను దాగి యున్నది
ఇస్లాము తరువు పెరుగుదలకు
దృష్టాంతముగ నున్నది
శత శతాబ్దాలలో దానివి
పెంచిన తోట పండ్లుగనున్నవి

## 28

నీ వసనాంచలము
దేశ ధూళిచే పునీత మైనది
ప్రతి నగరమును నీ రాజ్య రాజధానిగ
మార్చుకొనవచ్చును
నీ అనురక్త భక్తులు ఎప్పటికిని
ఎడారి వాసులు కారు
ఇస్లాము గంట మ్రోత తప్ప
నీకు వేరు ఆశ్రయము లేదు
జీవన ప్రదీపపు కాంతి కళికను
ప్రజ్వలింప చేయుటకు
ప్రతి దీప్త జ్వాలకును
వత్తి వంటి వాడవు నీవు
నీ సందేహచ్ఛాయలు తుదకు
పారి మాసిపోగలవు !

## 29

కొన్ని దేశములు పడిపోయినా
నీవు పడిపోవు
పాన పాత్రలు కొన్ని పగిలి పోవ
మదిరపు నిషాకు కొరత రాదు
తార్తార్ల ఆక్రమణ ఇతిహాసము
మనకు విదితమే
విగ్రహ శాలల నుండి
'కాబా' సంరక్షకులు లభ్యమైరి
కాల క్రమేణ సత్యపు నౌకకు
కర్ణ ధారులు మీరే !
నవ్యదినముల తిమిరావృత రాత్రులలో
మెరిసే వేగు చుక్కలు మీరే !

# 30

బల్గేరియా ఆక్రమణ పుకారులు
చెలరేగు చున్నవి
ప్రమత్తుల మేల్కొలిపే
ప్రభాత గాన మది
హృదయమును పీడించే
సంఘటన యని మీరు కలత పడుచున్నారు
మీ త్యాగాలకు, ఆత్మ ప్రతిష్ఠలకు
పరీక్షా కాల మది !
విరోధుల గుర్రపు ముక్కు ఋసలకు
ఏల భీతిల్లె దరు ?
శత్రువుల నిశ్వాసములచే
సత్య దీప్తి ఎన్నటికీ ఆరనేరదు

## 31

మీ సత్యము దేశ నయనములకు
మరుగున ఉన్నది
జీవన గోష్ఠులకు ఇంకను అది
అవసరమై యున్నది
మీ వేడిమి యుగాన్ని
బ్రతికించి యుంచ గలదు
మీ పరిపాలనా అదృష్టపు నక్షత్రము
ఉదయించుటకు ఇంకను అవకాశ మున్నది
తీరిక వేళలు ఎటుల సాధ్యము !
పని ఇంకను మిగిలి యున్నది !
ఏకేశ్వరుని వెలుగు హారతి సమాప్తము కాలేదు
వేళ యింకను మిగిలియున్నది

## 32

ముకుళములో బందీయై యున్నది
పరిమళము రీతి!
ఉద్యాన వన సమీరాలపై ఎక్కి
మీ ఆయుధాల భుజాల తగిలించుకొని
నలు దిక్కుల క్రమ్మండి!
ఎందుకూ పనికిరాని మీరు
ఇసుక రేణువు నుండి
ఎడారి కండు!
వీచికా సంగీతము నుండి
ఝంఝూ ప్రభంజన ధ్వని కండు!
ప్రేమ శక్తితో
క్రిందపడి జీరాడుచున్న వారిని
పైకి ఎత్తి నిలబెట్టుడు!
ప్రపంచమును మహమ్మద్ పేరుతో
కాంతి మంతము చేయుడు!

## 33

పుష్పము లేకపోతే
బుల్ బుల్ ల సంగీత తానము కూడ లేదు
ప్రపంచ వనములో
ముకుళ మంద స్మితమును లేదు
సాఖీలు లేకపోతే
మదిరమును లేదు-
కూజాయు లేదు !
ఏకేశ్వరుని సభా
ధరణిలో మ్రోగక పోతే
మీరును లేరు !
మీది ఏదియు మిగులదు
గగన శిబిరము నిలిచియున్న
అతని పేరుననే ఉన్నది !
బ్రతుకు నాడి వేడిగ ఉండి
కొట్టుచున్న
అతని పేరు ననే ఉన్నది !

## 34

ఎడారులు, పర్వతాంచలములు
సస్య క్షేత్రములు, సాగర సీమలు
తరంగాంకములు, తుపాను రెక్కలు
చైనా నగరాలు, మొరాకో ఎడారులు
మరియు ముసల్మానుల
దాగిన విశ్వాసములు
అతని పేరుననే నిలిచి యున్నవి !
ఈ దృశ్యమును రాష్ట్ర నయనాలు
శాశ్వతముగ చూడగలవు !
ఈ వైభవౌన్నత్యముతో
అతని స్మరణ ఉచ్ఛ స్వరములలో
సదా మారు మ్రోగుచుండును !

## 35

ఆ నల్ల ప్రపంచము ఆఫ్రికా
ఇలకు కంటి పాప వలె నున్నది !
అది మృత వీరుల ప్రాప్తించు కొనే ప్రపంచము
సూర్యుని తేజమును హెచ్చు చేసేది
చంద్ర ధ్వజమును వహించే ప్రపంచమే ;
ప్రేమ ప్రపంచ మని దేనిని అంటామో
అదే భక్తుల ప్రపంచము ;
అతని పేరు పాదరసమును వలె
వేడిమిని అధికము చేయును;
కంటి పాపల వలె
కాంతిలో ఈదు లాడుచుండును.

# 36

నీ బుద్ధి నీకు డాలు
నీ ప్రేమ నీకు కరవాలము !
నా సాధు సన్న్యాసులారా !
మీ పరిపాలనే
భూమిని ఆక్రమించుకొన గలదు
అల్లాకు గాక, ఇతరులకు
మీ ప్రార్థనాహ్వానము అగ్ని వంటిది;
మీరు ముసల్మాను లైతే
మీ చేష్టల నైపుణ్యమే
మీ విధి పుణ్యము కాగలదు;
మహమ్మద్‌పై విశ్వాస ముంచిరి
కనుకనే నేను మీ వాడను !
ఈ ప్రపంచము ఏమి పెద్ద విషయము ?
పలక బలపము తోనే
ఎంతైనా వ్రాసుకొన వచ్చును !

14-4-84
నెల్లూరు